# పిల్లల పాటల కథలు

కె. సభా

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

PILLALA PAATALA KATHALU - by K. SABHA

విశాలాంధ్ర ప్రచురణాలయం (1953-2003) స్వర్ణోత్సవ ప్రచురణ
ప్రచురణ నెం. : 2349
ప్రతులు : 1000
ప్రథమ ముద్రణ : డిశంబరు, 2001
ద్వితీయ ముద్రణ : జనవరి, 2003

టైటిల్ డిజైన్, లోపలి బొమ్మలు: జ్యోతి

వెల: రూ.20-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
E-Mail: visalaandhraph@yahoo.com

విశాలాంధ్ర బుక్ హౌస్,
(అబిడ్స్/సుల్తాన్ బజార్) - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

# ఒక్క క్షణం...

బాలసాహిత్యంలో కృషిచేసి లబ్ధప్రతిష్ఠులైన అతికొద్దిమంది మొదటితరం రచయితల్లో కె. సభా ఒకరు. ఆంధ్రప్రభలో 'బాలప్రభ'. శీర్షికను అనేక సంవత్సరాలు నిర్వహించిన అనుభవంతోనూ, పిల్లలపట్ల తనకున్న ప్రత్యేకమైన ప్రేమాసక్తులతోనూ ఆయన అసంఖ్యాకమైన రచనలు చేశారు. వాటిలో పిల్లలలో అన్ని వయస్సులవారికీ ఉపయోగపడే రచనలున్నాయి. ఆయన అన్ని ప్రక్రియల్లోనూ పిల్లలకోసం సాహిత్యాన్ని సృష్టించారు. పిల్లల గ్రహణ సామర్థ్యాన్ని, సృజనశక్తినీ పెంచేందుకు అవసరమైన సాహిత్యం రావల్సినంత విరివిగా అందుబాటులోకి రావడం లేదు. ఉన్న కొద్దిమంది రచయితల రచనలను పాఠకుల ముందుకు తీసుకురావడానికి రెండూ మూడూ ప్రసిద్ధ ప్రచురణా సంస్థలు తప్ప ఆసక్తి చూపడం లేదు.

కె. సభా సృష్టించిన బాలసాహిత్యం వాసిలోనూ, రాసిలోనూ గొప్పవే. పాటలు, పాటల కథలు, కథలు, నాటికలు, నవలలు మొదలైన భిన్న సాహిత్య రూపాలలో పిల్లలకు ఆయన అందించిన మానవీయ విలువలు, సందేశం, నీతి, కల్పనాశక్తి, పఠనాభిరుచి ఈ నాటికీ అత్యంత ఆవశ్యాకాలని నా భావన. ఈ ఉద్దేశంతోనే వాటిని సంకలనాలుగా ముద్రించి నేటితరం బాలలకు కానుకగా ఇవ్వాలని సంకల్పించు కున్నాను. 3-5 వయస్సుమధ్య పిల్లలకు ఒక ప్రసిద్ధ ప్రచురణ సంస్థ `బాలగేయాలు' అన్న పేరుతో ముద్రించింది. ఇప్పుడు విశాలాంధ్ర ప్రచురణాలయం మరో పుస్తకం `పిల్లల పాటల కథలు' వెలువరిస్తోంది. ఈ సందర్భంగా ప్రచురణకర్తలకు నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. నవంబరు 14, బాలలదినం సందర్భంగా చిరుకానుకగా పిల్లలకు సమర్పిస్తున్నాను.

డా॥ కె.యస్. రమణ

# ఇదీ వరస...

# చిన్ని చిన్ని ఆశ



''నొనా నానా నోనూ ఒత్తా
నానో నానో నోనూ ఒత్తా
లంగుల లంగుల బొమ్మలు తెత్తా
బొంగల మొకతి కొనుకో నొత్తా!''

''కానీ యిచ్చెద వద్దబ్బాయీ
కాళ్ళ నొప్పులు నిలువబ్బాయి''

''గులు గులు గులు గులు పలిగిత్తానే
గోలీ గుందులు కొనుకొత్తానే''

''నే తెస్తాను నిలువు వద్దురా
నీవు దూరము నడువ లేవురా''

''ఏమేమ్ తెత్తావ్ నానో నానో
ఎప్పులు తెత్తావ్ నానో నానో''

''ఏం కావాలో చెప్పర చిన్నా
ఏమి కోరినా తెచ్చెదనన్నా''

''ఏనుగు పెద్దది ఎత్తుకలా
లెక్కల గుల్లం పత్తుకలా

బొంగల మొకతీ తీతుకలా
లంగుల బలూను ఎత్తుకలా
గాలీ పతమును తీతుకలా
గోలీ గుందులు కొనుకోలా
బొమ్మల బుక్కు తీతుకలా
అమ్మకు పూలు పత్తుకలా
ఉం...ఉం...ఉంఉంఉం......ఊం...ఉం...ఉం
ఉల్లను కొల్లాయ్ తీతుకలా
గులు గులు మోతార్ కొనుకోలా
బిలె బిలె యింతికి తీతుకలా!''

# బేడ*



నిన్న రాత్రి కన్న కలను
ఉన్నది ఉన్నట్టు నేను
చెప్పెద విన మన్నాను
విన్నారి పాపను

ఏమిః టేమిటా కల యని
ఎగిరి దుమికి కూర్చున్నది
కథ యేమో వింటానని
కానిమ్మని చెప్పినది

★ దశాంశ పద్ధతి రాక ముందు రెండణాలు ఒక బేడ.

''పాపా యిది కథ గాదు
కోపము లాభము లేదు.''
అనగా విని పాప నవ్వి
''ఆహో! సరేలే'' యన్నది.

అనగనగా ఒక గ్రామము
ఆ గ్రామములో భవనము
భవనములో నివసించెడు
పాప చాలా గడుసుది!

ఒక్కనాడు అన్నగారు
పక్కపైన నిదురించెను
అన్న కోటు జేబుల్లో
ఉన్న బేడ కాజేసెను

కాఫీ కుంచిన బేడను
కలవరించి కలగనెను
పాప దొంగలించె ననుచు
పసిబట్టి కనుగొనెను.

అని చెప్పుచు పాపాయిని
గని పట్టుకొనగ బోతిని
''ఆగు మాగు మన్నన్నా
తూగు ముఖము కడుగన్నా

ఓహోహో తెలిసెనులే
ఊహూ ఇక చెప్పకులే
బేడ నేను యివ్వనులే
బెదిరింపులు సాగవులే

అని తుర్రున పరుగెత్తెను
ఔరా! ఈ పాపను

తరిమి తరిమి విసిగి నేను
తలుపు మీద ఒరిగినాను

గసలుబోయి నన్నుగాంచి
ముసి ముసి నవ్వులు నవ్వేడు
వదినె చెంత బేడ యిచ్చి
పాప నవ్వె పళ్లు విచ్చి!

# పంగనామాలు



గుంటూరందున గోవిందయ్యను గొప్ప న్యాయవాది
వాదించుటలో గోవిందయ్యకు లేదు సాటి ఎదిరి!
నాల్గు దిక్కులకు మ్రోగిపోయినది న్యాయవాది పేరు
తెలుగు దేశమున గోవిందయ్యకు కలిగె గొప్ప పేరు!

సుందరయ్య యను యువకుడొక్కడు వందనంబు జేసి
వాదనలోని పట్టు విడుపులను బోధించాలనెను
మొదటి కేసులో గెలిచిన పైకము ముట్ట జెప్పగలను
గురుదక్షిణగా నని జెప్పగనే గోవిందయ్యంత

న్యాయశాస్త్రమును నేర్పి బాగుగా న్యాయవాది జేసి
దక్షిణడుగగా కేసు గెల్వగనె తప్పక యిత్తునని
గోవిందయ్యే అప్పివ్వాలని కోర్టు కెక్కగానే
సుందరయ్యను ఓడించెను గోవింద య్యందరిలో-

పంగనామమే పెట్టితినంచు పక్కున నవ్వుచును
మొదటి కేసునే ఓడితి గాన ముట్టదు కాని యను
దక్షిణ లేదని సుందరయ్య తన దారి వెళ్లుచుండ
కోర్టున నున్న న్యాయవాదులు గొప్ప తెలివి యనుచు
సుందరయ్యను బలే మెచ్చుకొని రందరి సముఖమున!
ఓడిపోయిన గోవిందయ్యకు మాడిపోయె ముఖము!

# ఓహో! నయాపైసా!




నడివీథిలో నేను
నడిచి పోతుంటేను
నా ముందు కన్పించి
నది నయాపైసా!

ఎంత చక్కనిదిది
ఎర్రగా నున్నది
ఎండలో తళతళా
మెరసి పోతున్నది!

పైసాను ఎత్తుకొని
పరుగు తీశాను
మురుకు లంగడివైపు
ఉరక లేశాను
పైసాకు రాదంటు
పల్కింది అవ్వ!

పోనిలేమని నేను
పోతుండగా యెదుట
వచ్చాడు ఐసమ్మ
వర్తకుం డొకడు!

పైసాకు రాదంటు
పళ్ల నికిలించాడు
కాని లెమ్మనుచునే
కదలి పోయాను!

చాక్లేట్ నిమ్మంటు
సరదాగ అడిగాను
చాలదీ పైసనుచు
చప్పరించా డొకడు!

బొరుగులో శనగలో
త్వరగ కొనవలెనంచు
అంగడికి వెళ్లాను
అడిగాను కాని -
కానీకి తక్కువ
చుల్కనగ చూశాడు
ఘుర్రుమన్నది నాకు!

ఈ నయాపైసాకు
ఏమివ్వ గలరంచు
అడిగి అడిగీ నేను
అలసి పోయాను!

వెళ్లి వెళ్లి తుదకు
విఘ్నేశ్వరుని గుడి
సింహద్వారము కడకు
చేరుకున్నాను!

పైసాను మెల్లిగా
ప్రక్కనే ఉన్నట్టి
'హుండి' లోపలవేసి

ఒక్క దండము బెట్టి
ఓ వినాయక స్వామి
ఒక్క వరమిమ్మి
ప్యాసు మార్కులు నిమ్మ
పైసాను గొనుము!

''ఓరి సోమరి నీకు
నూరు మార్కుల కొఱకు
ఒక్కటే వచ్చింది
లెక్క లందునరా!''

ఓహో! నయాపైస
ఒక్క మార్కు తెచ్చింది
ఆ పైసా లేకున్న
అక్షరాలా సున్నా!

# బలేపెళ్ళి!



నాగావళి నది తీరమున
నాగరాజు అను కాపొకడు
నాగరాజునకు నాగమ్మనెడు
నల్లని చాయల పిల్లొకటి!

అందము చందము గలిగిన పడుచే
అయినా మెల్ల కన్నొకటీ
పెళ్లి చూపులకు వచ్చిన వరులు
కళ్లు చూచి మాకే లనిరి!

వేయి దేవులకు మ్రొక్కిరి గానీ
ఖాయము గాలేదా పెళ్లి
ఏడుకొండల వాడికి మ్రొక్కి
వెడలెను రాజు అల్లునికై!

కష్టంబులతో కాని నడకతో
కృష్ణా తీరము చేరగనే
కృష్ణయ్యను నొకరైతు అతనిని
కుతుకముతో రమ్మన్నాడు

''మేనల్లునికి పెళ్లి చేయవలె
మీ వైపున నొక పిల్లుందా?
ఒంటి కాలితో నిలుచున్నాడీ
తంటా కెట్టుల జేయుదును''

అని కృష్ణయ్య అడిగినంతలో
అన్నా డిట్టుల నాగన్న

''పిల్ల యున్నది పిన్నల పెద్దల
చల్లగ జూచును నొక కంట
హెచ్చు తగ్గుల భేదము లేదు
ఏక నేత్రమున జూచెడిది''

సరి సరి బావుందని ఇద్దరును
సరగున లగ్నము పెట్టుకొని
జరుగ వలసిన కార్యంబులను
చరచర మంటూ చేశారు!

పెళ్లి పీటపై ఒంటి కాలితో
పెళ్లి కుమారుడు నిలుచుండె
పెళ్లి కుమార్తె మెల్ల కన్నుతో
పెళ్లి కుమారుని చూచింది!

''సరిపోతుందా? కుంటి వాడితో
సంబంధంబా?'' అనె రాజు
''ఒంటి కాలితో నున్నాడంటిని
వింటివిగా'' యనె కృష్ణయ్య!

''గుడ్డిపిల్ల ఈ పెళ్లికూతురు
గడ్డిని తినిపించా'' రనగా
''ఒకే కన్నుతో చూమనంటినే
ఒప్పుకొంటివే '' యనె రాజు!

# చిటికెల పందిరి



కపట నటనల తళుకు మాటల గారడిలో ఘటికుడు
కన్ను గప్పితే నెదుటి వారిని సున్నా జుట్టెడు చోరుడు
దానమయ్యా వానిపే రందరికి తెలియును వీరుడు
కాని వాని ముందు నిలువరు గట్టివా డతి ధీరుడు!

అనుదినంబును రాజుగారు సభాంగణమ్మును కరుగును
తన శిరమ్మును వంచి మ్రొక్కుచు దాసుడంచును పల్కును
మంచివాడే దానమయ్యని మహారాజు తలంచెను
వంచకుండా మన్ననలతో మించి పోవుచు నుండెను!

ఒక్కనాడు రాజుగారి బొక్కసములో ధనమును
చక్కగా దక్కించుకొన కోశాధి కారిని జేరెను
దాసుడను బొక్కసము గాతును ధర్మపథమున నడతును
మీ సమానులు లేరు జగతిని మేటివారని పల్కెను!

''నేటి నుండియు బొక్కసముకడ నీవె కావలి యుండుము
మాట యిచ్చితి నాకు ఏ బహుమాన మిత్తువు చెప్పుము''

''చిటికెలా పందిరిని వేతును చిటికలోపల తప్పను''
ఎటనులేనిది యింటిముంగిట ఎంతయో సొగసిచ్చును!''

''చాలు పొమ్మని'' చెప్పగా విని సంతసముతో వెళ్ళెను
బలే మంచిది తరుణ మిదియని పైక మంతయు దోచెను!
ధనము నంతయు నింట జేర్చి దానమయ్యటు వచ్చెను
పనితనమ్మును జూడు చిటికెల పందిరిదిగో వేతును!

అనుచు నపుడొక చిటికె వేసి అదిగో అటునొక స్తంభము
వినుము దేవర చిటికె రెండు కనుము రెండవ స్తంభము
ఎంత అందము చిటికె మూడు ఇదిగో మూడవ స్తంభము
చింత మానుము చిటికె నాలుగు చెంతనే అదె స్తంభము

నాల్గు చిటికెలు నాల్గు కూసలు నాణెముల స్తంభమ్ములు
ఐదు, ఆరు, ఏడు, ఎనిమిది అందమైనవి అడ్డులు
అనుచు వంద చిటికెలేసి వినుము దేవర యియ్యదే
గనుము చిటికెల పంది రిదియని ఘనుడు చెప్పిన విన్నదే!

వంద చిటికెల మోసమన్న వాస లెక్కడ కూస లెక్కడ
ముందు గతి యోచించ నైతిని మోసపోయితి న్యాయ మెక్కడ
ఉందిలే యని చేతి ఖడ్గము నందుకొన లేవంగనే
కందిరీగ పగిది పరుగిడె ఘనుడు మాటల వినకనే

# పిట్టగూడు



మా విద్యాలయమం దొక
మామిడి చెట్టుంది
తీపి మామిడి చెట్టుంది

చెట్టు కొన కొమ్మందొక
పిట్టా గూడుంది
చిలుక పిట్టా కూర్చుంది

ఏమమ్మా చిలుకమ్మా
రావేరా ముద్దుల గుమ్మా
దిగి రా బంగరు బొమ్మా

మా యింటా రతనాల
మణులా గూడుందీ
మా మంచీ తోడుందీ
అంటూనే పిలువంగా
వింటూనే చిలుక
రా నన్నది అలుక

రతనాల మణులేలా
రానూ పొమ్మందీ
నాగూడే చాలందీ

నిన్నా మా బావయ్యా
ఇన్నీ తెచ్చాడు
నా కిన్నీ ఇచ్చాడు

బూందీ జిలేబీలు
బుట్టేడు లడ్లు
నా కివ్వద్దే దుడ్లు

కొమ్మా కొమ్మకు తట్ట
కమ్మని మామిళ్లు
కడుతీయనివి పళ్లు

పొమ్మావల నా కేటికి
బూందీలు లడ్లు
నా కేలమ్మ దుడ్లు

''సిల్కూ పరికిణీ వేస్తా
చిలుకా రావమ్మ
నా చిలుకా లేవమ్మ
రంగూ రంగుల సిల్కు
రాగాల గుల్కు

నా రాణీ హోయలొల్కు
పసిమీ పచ్చని రంగు
పరికిణీల తుళుకు
నా పావడాల చిలుకు
మిసిమీ వన్నెల చాలు
మించూ నిగ నిగలు
గో రంచూ జిగ జిగలు''

''పసిమీ పచ్చని రంగు
పరదా ఒకటుంది
నా జరదా నాకుంది
కెంపూ పగడము ముక్కు
సొంపూ తళుకుంది
నా ఇంపూ నా కుంది''

పోనీ రాకుంటే నీ
పొగ రణతు ననుచు
నీ మద మణతు ననుచు
వంగీ వానము నెత్తి
నింగీ కెగ నిక్కి
నా అంగీ బిగజుట్టి
కొట్టంగ నుంకించితి
పట్టూ దప్పింది

పం-తులపైనే వాలింది
ఆ చెంపా ఈ చెంపా
అట్లా దిరుగంగ
పెసరట్లు పోయంగ
ఛెళ్ ఛెళ్లని వాయించెను
చెంపలు బగులంగ
చే - తిమ్మిరి వదలంగ
కనులాకా దేశం
బైనది కొలను నీరు
ఒక చెరువే కన్నీరు

పిట్టా గూడును చేయి
పెట్టంగ రాకు
వాటి - కొట్టంగ బోకు
పద నీపని చెబుతానని
పంతులు పలుకంగ
పరు - గెత్తితి మౌనంగ!

# పాపాయి కోవాయి



ఆసియా పాపల్లు
అమర జ్యోతుల్లు
భువి నుండి దివి దాక
పొంగు కీర్తుల్లు!

ఆసియా ఖండాన
అందాల దేశం
చైనాను పాలించు
చక్కన్ని రాజు
పని వారి బిలిపించి
పలికె నొక నాడు!

మేఘాల నందుకొను
మేటి మేడలను
కట్టించితిమి గాని
గంట స్తంభమున
ఘణ ఘణా మ్రోతల
గంభీర ధ్వనుల
గంట నిర్మించేటి
ఘను డెవ్వ డనెను!

బ్రహ్మాండ మైనదా
బ్రహ్మ విద్యనుచు
బదులాడ లేరైరి
పని వారలపుడు!

శిల్పు లెవ్వరు లేర?
చిత్ర మాయెనుగా?
గొడ్డు పోయిన దేల?
గొప్ప దేశంబు?
అని ప్రశ్న వేయుగా
విని ముందు నిలిచె
కంచరి వాడొకడు
కడు వినయ మొప్ప!

గంట చేసెద నంటు
ఖర్చులకు ధనము
తీసుకొని యిలు సేరి
మూస దెప్పించె!

శాస్త్రాల శోధించి
శాస్త్ర రీతిగనే
మూసలో ద్రవ మెత్తి
పోసినా డంతే!
బ్రహ్మాండ మా మూస
బ్రద్దలై పోయె!

దిగులుతో పనివాడు
దీనుడైనాడు!

మరల లోహములన్ని
కరిగించినాడు!

గంట తీరెను గాని
గంటలో నెన్నో
చిల్లులు సందులు
కొల్లలై పోయె!

చివరి సారికి రాజు
చీకాకు పడుచు
గంట ఈ మారు నా
కంట బడకున్న
ఉరి దీతు నిన్నని
ఉగ్రుడై పలికె!

శిల్పిగుండెలు కరిగె
చింతలో మునిగె
చిట్టి ముద్దుల పాప
చెంత జేరింది!

ఎందుకో ఓ నాన్న
ఏమి దిగు లండీ
గంట చేయంగలము
గాభరా లేల?
అని చెప్పి వెంటనే
ఆ నగర మందు
జ్యోతిష్యమును జెప్పు
జోగి వెంటకును
పయనమ్మై వెళ్ళింది
ప్రశ్న వేసింది

సన్యాసి తల యూపి
శాస్త్రంబు చూచి
పడుచు పాపా యొకతె
బలియైన యెడల
చక్కన్ని గంటగును
మొక్క వోదనెను

కంచరి కూతురు
కలికి కోవాయి
పరుగుతో యింటికి
పరుగెత్తి వెళ్ళి
నాన్న రఃసారి మీ
కున్నా శిల్పముతో
గొప్ప గం టగునని
చెప్పి ధైర్యమును

పురికొల్ప కంచరి
పూనుకొనె గంటచేయంగ

ఏలోహ మెం తెంత
పాలుండ వలెనో
మేలు లోహము లేవొ
చాలా యోచించి
కరిగించి మూసలో
మరిగించి పోసె

ఆగు డాగుం డని
ఆ దిక్కు నుండి
పాపాయి కోవాయి
పరుగుతో వచ్చె
కళ్ఫెళా వుడుకుచూ
కరుగు లోహముల
ఉరికింది మూసలో
ఉడికి పోయింది

తండ్రి బిడ్డను జూచి
గుండె పగులంగా
పట్టుకో బోయేడు
పాదాలు బట్టి
కాలి జోడును బట్టి
తూలి లాగాడు
జోడు తన చేతికీ
ఊడి వచ్చింది.
ఘణ ఘణ ధ్వనులతో
ఘణ ఘణలు మ్రోగ
గింగురో మను మ్రోత
ఖంగుమను ధ్వనుల

''పీకింగు'' నగరాన
పెద్ద గం టండీ
''హేయ్ హేయ్'' ధ్వనులను
చేయు చుంటుంది

నాకాలి జోడును
నా కివ్వ మంటూ
పాపాయి ప్రజలను
పలకరిస్తుంది'

పాపాయి ''కోవాయి''
పసిడి తురాయి
''పీకింగ్'' నగరాన
పిలుచు సన్నాయి
ఎంత త్యాగం బన్న
ఎంత ధైర్యంబు
కంచరీ చిట్టికై
కనుల నీరుంచె

ప్రభువు గారిది తెలిసి
పరితపించాడు.
ప్రజలంత ''కోవాయి''
పాట పాడారు.
ఆసియా పాపల్లు
అమర జ్యోతుల్లు
భువి నుండి దివి దాక
పొందు కీర్తుల్లు.

# పైలెట్ బావ



బుర్రు బుర్రు విమానాల
తుర్రున నడిపే నేర్పుల
ఆరితేరినాడు చాల
ఊరి కొచ్చినాడు బావ!

నిమిషంలో పదిమైళ్లు
నింగిని చివ్వున వెళ్ళు
పైలెట్ బావా నిన్ను
పట్టీ కొట్టిస్తాను!

పందెం నాతో వేసే
పసలుంటే రమ్మంటిని
పందెం గెలిచిన నీదు
పాపను నా కిమ్మంటిని!

అక్కా నీవే సాక్షి
చిక్కె పాప మీనాక్షి
ఒక్క మాటపై బావ
అక్కా పందెము రావా!

బావను మెల్లగా డాబా
పైకి తీసుకొచ్చాడు
గాలీ పటమును యిచ్చి
గగనం చూపించాడు.

పటము దీసుకొన్నాడు
పైకి ఎగురవేశాడు
వెనక వెనక లాగాడు
వెల్లకిలా పడ్డాడు.

అయ్యో పైలెట్ బావ
ఆ మాత్రం చేయలేవ
చూడు చూడు నానేర్పు
మేడల దాటెను తూర్పు!

మేఘాల అంచుల్లో
మెరిసే ఆ మెరుపుల్లో
నా గాలి పటము చూడు
నటనలు చేస్తూ పాడు

గట్టిగ దారం లాగి
గగనానికి విడిచాను
బట్టలు దులిపే బావ
పైకి లేచి వస్తావ

చిట్టి చెల్లి కిల కిల మని
గట్టిగానె నవ్వింది
అక్కయ్య నవ్వులను
ఆపలేక పోయింది.

పక్కన మాపాపాయి
ఒక్కసారి నవ్వింది
కుక్కిన పేనై బావ
దిక్కు దిక్కు చూశాడు.

# అసాధ్యము




మళ్ళీ నే నొక పిల్లాడైతే
వెళ్ళగలను గద పాఠశాలకు
అనిపించింది నాకిపుడు
ఐనా కాదది అసాధ్యము

ఓనామాలు దిద్దు కొందును
ఒకటీ రెండ్లు నేర్చుకొందును
కాకీ, నక్క కథలు విందును
కమ్మని పాటలు పాడు కొందును

చిన్న సంచి నాచేత బట్టుకొని
చిన్న చిన్నగా ఇంటికి వచ్చి
'అమ్మా బువ్వని' అడుగుదును
అన్నం తిని మరి వెళ్లుదును!

బడిలో తోటకు నీరు తోడుదును
పార నెత్తుకొని మట్టి త్రవ్వుదును
సాయంకాలము ఆడుకొందును
సరదాగా నే నింటికి వత్తును

అమ్మా నాన్నా అవ్వా తాతా
అందరు నన్ను ముద్దిడు కొందురు.
పొంతకుండ నీళ్ళోసు కొందును
పొడి బట్టలను కట్టు కొందును

దీపం ముందరనే కూర్చుందును
దిద్దుకొందును కొత్త పదములను
అమ్మ పిలిచితే పైకి లేతును
అన్నం తిని మరి అడుగుదును

వెన్నెలలో మా అవ్వ చెప్పును
ఎన్నెన్నో రాజుల కథలు
అన్నియు శ్రద్ధగ ఆలకింతును
ఆనందముతో నిదురబోదును

మళ్ళీ నే నొక పిల్లాడైతే
వెళ్ళగలను గద పాఠశాలకు
అనిపిస్తున్నది నాకిపుడు
ఐనా కాదది అసాధ్యము!

# పిడుగు



ఫెళ ఫెళార్భటులతో పిడుగు పడగానే
భీతిల్లి కామాక్షి బెదరిపోయింది.
అమ్మ ప్రక్కను జేరి అడుగ దొడిగింది
''ఏమిటే అమ్మ ఇపుడేమి జరిగిందే?
ఎక్కడో పడినదే ఒక్కటే గుండు!''

''పిడుగు పడిందమ్మ పిడుగు పడిందే!''
''పిడుగన్న ఏమిటే? పిడుగేమి పిడుగే?''

మిల మిలా తళ తళా మిన్నులాదేలి
మింట తళుక్కుమని మెరిసిపోతుంది.
అంత చక్కని పిల్ల నర్జునుడు చూచి
పంతంబు బట్టాడు పరిణయం బాడ!

కాని దొరకదు మెరుపు గడుసుదా పిల్ల
గాండీవి రథమును గగన వీథుల్ల
వాయు వేగమ్ముతో వడినడుపువేళ
బ్రహ్మాండములు పగుల పరుగెత్తు రథము
ఆ మహాధ్వని యదేనమ్మ ఈ ఉరుము

వ్యోమాన ధణ ధణల్ పుట్టి ఘోషించు
చక్రముల రాపిడుల సాగి కడచీల
శబ్దాలతో మేఘ సౌధాల దూసి
పృధ్విపై బడునపుడు ఫెళ ఫెళార్భటిని
పిడుగుపా టంటారు భీతిల్లకమ్మా!

''అర్జునః ఫల్గుణః పార్థః కిరీటీః శ్వేతవాహనః
బీభత్సుర్విజయః కృష్ణ స్సవ్యసాచీ ధనంజయః ''
అన్నచో మన మీద ఆ పిడుగు పడదు
ఇంతలో అన్నయ్య విన్నాడు కథను
''ఎంత కల్పనగాథ ఈ వింత గాథ!
మేఘాలు ఒక టొకటి మింట ఢీ కొనగ
మెరుపు పుట్టును నిజము మీ కేమి దెలుసు!
ఆ మహాశక్తి యీా యవని దాకుటనే
పిడుగు పాటంటారు పిట్ట కథ గాదే!''

ఈ కథా? ఆ కథ ఏది నిజమంచు
నాకు చెప్పని పాప నాన్న నడిగింది
నాన్నేమి చెబుతాడు? నవ్వుకొన్నాడు!

# హా! తెలిసెన్



బడి గంటలు గణగణ మని
గుడి గంటలుగా

వడి వడిగా వినబడగా
పరుగిడినాము

పంతులయ్య కా రోజున
బలే కోపము
వచ్చిన కారణ మేమో
వరుసగ మమ్ము

చేతులు చాపండి యనుచు
వాతలు దీసె
పేము బెత్తమున గట్టిగ

బెదరిపోతిమి
కిక్కురు మనలేదు మేము

ఒక్కరైనను
ఎక్కమ్ములు చెప్పండని
చిక్కు బెట్టెను

దిక్కు దిక్కు చూచి మేము
దిగులు పడితిమి
ఎక్కించెను 'డెస్కుల' పై
ఒక్కసారిగా

''కటకటా! ఈ కోపమునకు
కారణ మేమి?''
''హో! తెలిసెన్'' అన్నాడొక
అర్భకు డపుడు.

ఏమిటేమి టబ్బాయని
మేము అడుగగా
''ఉదయం పంతుల ఇంటినీ
ఉంటిని నేను

పంతుల నశ్యం డబ్బీ
పడిన దెక్కడో
వెదకి వెదకి అయ్యవారు
విసిగి – వచ్చిరి''

# కొత్త సంవత్సరము



పాత సంవత్సరము
పరుగెత్తి పోయె
కొత్త సంవత్సరము
కులుకుతూ వచ్చె

నవ్వుతూ నవ్వుతూ
నా ముందు నిలిచె
ఏమి కావలెనంచు
గోముగా నడిగె

ఎలుగెత్తి చెప్పెను
కల కోరికలను
కొత్త సంవత్సరము
కూర్మితో వినెను.

పాత కథలను చదివి
రోత పుట్టినది
కొత్త కథలను ఒక్క
కోటి విన్పించు!

పాడిన పాటనే
పాడు దాసరులు
అన్నట్టు లున్నవే
అమ్మ మా పాట

లక్ష పాటల మాకు
రచియించి యిమ్ము
కొంగ్రొత్త రాగములు
కూర్చి మా కిమ్ము

చీమ తలకాయలు
చిన్నాక్షరములు
మట్టి రంగులు దుమ్ము
పొట్టు కాగితము

చదివితే మా కనుల
నుదయించు నీరు
చదవకుంటే మమ్ము
చావ గొట్టెదరు

మంచి బొమ్మలు రంగు
మాయకుండాను
పుస్తకమ్ముల తెమ్మ
పుణ్య ముంటుంది

ఉల్లి పొరవలె అట్ట
ఊడి పడుతుంది
చింపుకొన్నా మనుచు
చితుక తంతారు

గట్టి అట్టలు కూడ
కరువయ్యె మాకు
మంచి అట్టల బుక్కు
ఎంచి ఒకటిమ్మ

ఎక్కాల పుస్తకము
ఎంత చిన్నది
అరచేతి వైశాల్య
మైననూ లేదు

చెప్పనెందుకు లెమ్మ
చిన్నవారనుచు
చిన్న చూపులు చూచు
చున్నారు సుమ్మ

బాలల దీవెనలు
బ్రహ్మ దీవెనలు
బాలల శాపాలు
బ్రహ్మ శాపాలు

నీవైన మా మొరలు
నిలిచి విన్నావు
తీర్చగలవో లేవో
దేవునికి ఎరుక

చిత్తగించుము అనగ
కొత్త వత్సరము
నీ కోర్కెలను దీర్తు
లెమ్మంచు పల్కె

ఏడాది గడువుంది
వేచి చూద్దాము
తీర్చగలదే అని
ఓర్చి ఉందాము

# కడప



చెన్నపురిలో రాయపురమున చిన్న వాడొక డుండెను
పిన్న పెద్దల పట్ల యాతని కున్న ప్రేమ యతీతము.

కాని వానికి బుద్ధి మాంద్యము కలదు కొంచెము మౌఢ్యము
ముందు వెనుకలు తెలియవాతనికి అందునూ అయోమయం.

ఒక్క రోజున వారి యింటికి ఒక్క బంధువు వచ్చెను
చిన్న యిల్లది పండుకొనగా నున్నచో టది స్వల్పము!

లోన పడుకొని నిద్రపోయెడు వాని లేపుచు తండ్రి యా
కడపలో పడుకొమ్ము పొమ్మని పడక చుట్టను యివ్వగా

వెంటనే కుఱ్ఱాడు బిరబిర వెళ్ళి స్టేషను చేరెను
ఎక్కి రైలును చేరె కడపకు ఒక్క రాత్రి ప్రయాణము

కడపలో నొకచోట పడుకొని గాఢముగ నిద్రించెను
కడకు మేల్కొని లేఖ వ్రాసెను కలముగైకొని తండ్రికిన్

''నాన్నగారికి వందనమ్ములు! నాన్న మీ రన్నట్టులే
కడపలో శయనించి యుంటిని గాన జాబును వ్రాసితిన్ ''

కుఱ్ఱవా డెటు పోయెనో యని గోడుగోడున ఏడ్చుచున్
కుములు వారా జాబు గనుకొని గొల్లు మనుచును నవ్విరి

మాట దాటని చిన్నవాడు అమాయకుండని తండ్రి యా
రాట పడుచును వెళ్ళి బిడ్డను రాత్రియే యిలు జేర్చెను.

# ఆగస్టు పదిహేను



అమ్మా ఈ నాడేమే
అలికి ముగ్గు లేశావే

మామిడాకు తోరణాలు
మా బాగా కట్టావే
మా తాతకు మెడ నిండా
మల్లెల పువ్వుల దండా
చెప్పవేమె ఈ విషయము
గొప్పదేమి ఈ దినము!

పండుగ లందున పెద్ద
పండుగమ్మ ఈ నాడు
ఆగస్టు పదిహేను
అందరికి పండుగేను!

అందరికీ పండుగటే
అది ఎట్లో చెప్పవటే

బంగారు బాపూజి
ఆంగ్లేయులను గెల్చి
పరదాస్యమును ద్రుంచి
ఫలితం బిచ్చిన దినము!

ఆ కథనే చెప్పమ్మా
ఆలస్యం బేలమ్మా!

ఆ నాటి సమరములు
ఈ నాటి చరితములు
ఏ నాటికి ఆ కథలు
మనసులలోనే మెదలు

మరఫిరంగుల ముందు
పౌరుషమ్ములు చిందు
బాలుర వీరుల కథలు
బలే బలే అద్భుతములు

బాలలు గూడా యుద్ధం
బాగుగనే జేశారు?

దోగాడెడు పసివాడు
ఊగి ఊగి లేచాడు
ఆ గాంధి తాతయ్య
అడుగు జాడ నడిచాడు

పాలుత్రాగు పసిపిల్ల
జేలు గొట్టి లేచింది
పిడికిళ్లను బిగియించి
నడిచింది యుద్ధానికి!

ఆహో-----ఓహో-----
ఆనాడు నేనుంటే
కత్తిని పట్టేదాన్ని
కదం త్రొక్కి పదంపాడి
కదనం చేసే దాన్ని!

ఉప్పు సత్యాగ్రహములు
గొప్పవి పోరాటములు
వ్యక్తి సత్యాగ్రహములు
శక్తిగల్లా ఆయుధములు

బోసు అన్న కానాడు
రోసమ్ములు పెరిగె మాడు
వీరసైన్యములను జేర్చి
పోరాటమ్ములను సల్పె!

ఏమైనది ఆ యుద్ధం
ఎవరి కందెనే విజయం?

వీరులనందరి బట్టి
చెరసాలలలో బెట్టి
పాలించగ జూచారు
వీలుగాక పోయింది
భారత వీరుల శక్తి
పోరాటంబుల యుక్తి
కోరి తెచ్చుకొన్న మిత్తి
తీరదింక అని విరక్తి
చెంది వారు రాజ్యంబును
ఇచ్చి వెళ్లి పొయ్యారు

అంతగాక ఏ మౌనే
ఇంత పెద్ద దేశాన్నే
చాల చిన్నదాదేశం
ఏలుట కెట్టుల సాధ్యం

ఆగస్టు పదిహేను
అందుకేను పండుగలను
అన్ని పర్వదినములను
మిన్న యైన దీదినము

పాడుకుందునే నేను
బాపూజీ పాటలను
తలచుకొందునే నేను
బాల వీరగాథలను

# కంచికథ



ఏడుగురు రాజులు
వేటకై వెళ్ళారు
ఏడు చేపలు తెచ్చి
ఎండ వేశారు.

అన్నయ్య కథ నంత
విన్నాను వివరంత
కథ కంచి కన్నాడు
మన మింటి కన్నాడు

ప్రతి కథకు అన్నయ్యా
పాట కథ కంచికే
కథలన్ని కంచికే
కదలి పోవడమే!

అన్నయ్యా చెప్పరా
అన్ని కథలూ చివర
కంచికే వెళ్లుటకు
కారణం బేమి!

అన్న ఈ ప్రశ్న విని
చిన్నగా నవ్వి
తప్పకుండా రేపు
చెప్పగల నన్నాడు!

మరునాడు అన్నయ్యా
మంచి కథ చెబుతాను
అని మొదలు పెట్టగా
ఆగ మని చెప్పాము

కథలు కంచికి వెళ్ల
కారణము చెప్పండి
చెప్పకుండా నీవు
తప్పించుకో లేవు!

కథలు కంచికి వెళ్ళు
కారణము గలదు
కంచిలో లేని కథ
కన్పించ బోదు

శివ కంచిలో గలవు
శిల్పాలు వందలు
విష్ణు కంచిని గన్నా
వేల శిల్పాలు!

ప్రతి శిల్ప మొక కథను
ప్రకటించు చుండును
ప్రతి చిత్ర మొక కథను
ప్రసరించె చిత్రము

మన పురాణములోని
మంచి కథలన్నిటిని
రాళ్ళలో మలిచారు
రమ్యముగ తొలిచారు
ఏర్చి కూర్చిన కథలు
ఎన్ని యో గలవు
ఎంచగలమా మనము
ఎన్నొ లెక్క లేవు

కనుకనే ప్రతి కథను
కంచి లో నేర్చుకొని
కథను చెప్పిన పిదప
కంచి కంపించెదము!

కథ కంచి కెళ్ళినది
మన మింటి కెళ్ళెదము
అన్నాడు అన్నయ్య
విన్నాము కంచికథ

# నిలువు దోపిడి



హోటలుకు యజమాని
మేటి వర్తకుడొకడు
కోటికే పడగెత్తు
గొప్ప కోరికతో

ఏడుకొండల మీది
కెక్కి వెళ్ళాడు
వెంకటేశ్వరు నిట్లు
వేడుకొన్నాడు

''మనుష్య లెక్కువ వచ్చి
మంచి బేరము సాగి
లక్షరూపాయలు
లాభమందిన చాలు!

నిలువు దోపిడి యిత్తు
నీలాలు యిత్తు
ఇల్లు దీర్ఘమే వచ్చి
కొలిచి వెళ్లెదము''

ఇల్లు చేరిన వెనుక
మెల్ల మెల్లగ మంచి
లాభమే వచ్చింది
లక్షపై సంఖ్యలో!

''ఏడుకొండల వాని
కేల ధన మివ్వాలి
ఇచ్చినది దేవుడే
ఎవరిదీ డబ్బు''?

అని మదిని తలపోసి
తనవారితో నతడు
ఏడుకొండల మీది
కెక్కి వెళ్ళాడు

నిలువు దోపిడి ముందు
ఒలుచుకొని నగలన్ని
కట్టు గుడ్డల మూట
గట్టే యిచ్చారు!

ఆ వెనుక నగలన్ని
అందముగ ధరియించి
సంతోషమున వారు
సాగిపోయారు!

ఇల్లు జేరిన వెనుక
చల్లగా జెప్పారు
''కొల్ల గొట్టిరి దొంగ
గుంపు మీ యింటినని''

నిలువుదోపిడి గాదు
ఇల్లు దోపిడైనదా
ఏడుకొండల వాడు
ఎంత పని చేశాడు

నెత్తి నోరును వారు
మొత్తుకొని ఏడ్చారు
లోభి కెన్నటికైన
లాభించబోదు!

# కాకమ్మ ప్రయాణం



చిత్తూరులో ఒక
చింత మానుంది
కొమ్మలో ఒక కాకి
గూడు కట్టేంది!

చెట్టు క్రిందనె ఆగు
చెన్నపట్నము వెళ్లు
పెద్ద బస్సును చూచి
బుద్ధి గల కాకి!

''ఎందరో మదరాసు
ఏగుచున్నారు
ఎప్పుడో ఒకనాడు
ఏగవలె నేను''!

అనుకొన్నదే కాని
పని లేక ఎందుకని
పయనమే కాలేదు
పాపమా కాకి!

తెల తెల్లవారగా
తెలుగు పత్రిక వచ్చె
అందులో ఒక వార్త
ఉంది ఈరీతి!

''తెల్లనిది ఒక కాకి
కల్లగా దిది నిజము
'జూ' లోన ఉంచారు
చూడండి వచ్చి''

అరెరె ఏ మిది వింత
ఆశ్చర్యమైనదే
కాకి తెల్లది యట
కలికాల మహిమ

'జూ' లోని కాకిని
చూచి రావలెనని
మనసులో అనుకొని
మరునాడు కాకి

పయనమై మద్రాసు
బస్సుపై కూర్చునెను
బస్సు మొర్రోమని
పరుగెత్తి పోయె

టిక్కెట్టు కొనలేదు
టక్కులాడీ కాకి
వక్కగా టాపుపై
నిక్కి చూస్తోంది

టాపుపై బుట్టలో
టమాటాలు, కమలాలు
అరటి పండ్లను బాగా
ఆరగించినది

సింగార సత్రాన
అంగడికి వెళ్ళింది
చిన్ని రొట్టెను కాల
తన్ని తెచ్చింది

బయలు దేరెను బస్సు
బాటపై తుర్రుమని
గంటలో మద్రాసు
కడకు వచ్చింది

ఆకాశమును తాకు
ఆ మేడలను గాంచి
అమ్మ బాబో అని
అవులించింది.

'జూ' లోకి వెళ్ళింది
చూచింది కాకి
పల్కరించెను అది
పలుకనే లేదు

''నే వచ్చు లోపలే
నీవు చచ్చితి వహో
కావు కావని'' కాకి
కన్నీరు విడిచి----

అటు చూచి ఇటు చూచి
కటకటా యని లేచి
బస్సు వేళాయెనని
బయలు దేరింది

బ్రాడ్వేకు వెళ్ళింది
బస్సు కనబడలేదు
పది నిమిషముల ముందు
కదలి పోయింది

రివ్వుమని పై కెగిరి
చివ్వు మని దూసుకొని
బాటనే చూచుకొని
పై పైన ఎగిరింది

వెయ్యిదీపాల కడ
రయ్యిమని వాలింది
చిత్తూరు మోటారు
చిక్కి పోయింది

టిక్కెట్టు కొనకనే
చక్కగా కూర్చుని
గుట్టుగా ఆరాత్రి
గూడు చేరింది

# చైతన్య స్రవంతి



నిదురపో నిదురపో నిదురపోరా చిట్టి
నీలాల రుమలీను నీ కనుల కాంతిలో
పదునాల్గు భువనాలు పరవశిస్తున్నాయి

నీ పాటలే గదా సెలయేటి గానాలు
నీ ఆటలే గదా నెమలి నృత్యాలు
నీ మాటలే గదా నిజమైన వేదాలు
నీ నవ్వులే గదా నిత్యమౌ మల్లియలు
నీ నవ్వు పువ్వులే నింగిలో తారకలు
నీ పలుకులే గదా రా చిలుక కలకలలు
నీ తప్పటడుగులే వామనుని పాదాలు
నీ తనువు మెరుపులే మేఘాంచలాలు

బంగారు కలువల్లారా
నా కన్న పాపల్లారా
వస్తారా మాయింటికి మీరు
యిస్తాను మీకు పుస్తకాలు
మీ మాటలనే పలకండీ
మీ పాటలనే పాడండీ
బంగారు కలువల్లారా
పంచవన్నెల చిలకల్లారా
నా కన్నుల పాపల్లారా
నా తెలుగు బాలల్లారా
వొస్తారా మా యింటికి మీరు
యిస్తా మంచి పుస్తకాలను

మా చెట్లో వో కోకిలున్నాది
మంచి పాటలను పాడుతున్నది.
జామి చెట్టులో ఉడుత వున్నది
కొబ్బరి చెట్లో కాకులున్నవి
గోల పెట్టుచు అరుచు చున్నవి
యింటి పిచ్చుకలున్నది
కిచ కిచ గెంతు తున్నది
గూటిలో మిణుగురులున్నవి
మిల మిలా మంటూ మెరయు చున్నవి.
మంచి మామిడి పండ్లు వున్నవి
మాధుర్యములో మించి పోయినవి
తీయని చెరకు పానక మున్నది
తేనె పట్టునకు తీసిపోనిది.